ఓ౩మ్

# సత్య ధర్మ విచారణ

## (ధర్మ చర్చ)




అనువాదకుడు : స్వా. పం. కేశవార్యశాస్త్రి

గాయత్రి ఆశ్రమ ప్రచురణ

# అమరులు అన్నే కేశవార్యులకు

(హృదయపూర్వక కృతజ్ఞతాంజలి)

ఆర్య విద్వాంసులు శ్రీ పం. అన్నేకేశవార్య శాస్త్రి గారిని గూర్చి తెలియని వారు ఆంధ్రదేశంలో ఉండరు. వీరి గురువుగారైన శ్రీ పం. పాలడుగు శేషాచలవర్మగారితో కలిసి మహర్షి దయానందసరస్వతి కృత యజుర్వేద భాష్యమునకు తెలుగులో సంపూర్ణమగు అనువాదము నారంభించి 1958 సం॥రం ఫిబ్రవరిలోనే ప్రథమ సంపుటిని వెలువరించిరి.

వీరు నిరాడంబర జీవి. ఆదర్శపురుషుడు, సంఘసంస్కర్త, వైదిక విద్వాంసుడు. నిరంతరం కాలినడకన తిరుగుతూ వేదధర్మాలను ప్రచారం చేసిన కష్టజీవి. స్వయంగా వేద ధర్మమనే మాస పత్రికను నడిపేవారు. ఉపాధ్యాయుడిగా పనిచేయునపుడు వచ్చే వేతనాన్ని వైదిక సాహిత్యముద్రణకై ఎక్కువగా ఖర్చు చేసేవారు. వీరి త్యాగము అపూర్వమైనది.

వైదిక సిద్ధాంతాల ప్రచార నిమిత్తం వీరు గ్రంథరచన చేయుటతో పాటు యితర ఆర్య విద్వాంసులచే తెలుగులో అనువదింపబడిన గ్రంథాలను వైదిక సాహిత్య ప్రచురణలనే సంస్థను స్థాపించి ముద్రించేవారు. యజుర్వేద భాష్య ముద్రణ కార్యం పూర్తికాగానే ఋగ్వేద భాష్యానువాద కార్యం చేపట్టిరి. కానీ వీరి అకాల మృత్యువుతో ఆ కార్యం అంతటితోనే నిలిచిపోయింది.వీరు తన సహజ స్నేహ స్వభావంతో ఆంధ్ర రాష్ట్ర నలుమూలలే గాక, ఇతర రాష్ట్రాలలోను, అమెరికా వంటి ఇతర దేశాలలో వీరి శిష్యులు కలరు. విశ్రాంతి యనునదెరుగక వైదిక సాహిత్యమునకపారమైన సేవ చేయుచున్నవీరు తీవ్ర అనారోగ్యమునకు గురై 1973 సం॥రం మార్చి 11వ తేదీన దివంగతులైరి.

ఆంధ్రప్రజానీకమునకు స్వర్గీయ శ్రీ కేశవార్యశాస్త్రి గారొనర్చిన మహోపకారము మరువలేనిది.

అక్టోబర్ 16వ తేదీన వారి 91వ జన్మదిన శుభ సందర్భాన వారి సంస్మరణలో సామాజికులకు అత్యంత ఉపయోగకరమైన ఈ గ్రంథరాజమును పాఠకుల కందించుచున్నాము.

సంధ్యావందనం శ్రీనివాసరావు

ఓ౩మ్

# సత్య ధర్మ విచారణ

## (ధర్మ చర్చ)



మహర్షి దయానందుడు పాల్గొన్న ఆర్య-క్రైస్తవ
మహమ్మదీయ సమ్మేళనపు వివరణము

అనువాదకుడు : స్వ. ఏం. కేశవార్యశాస్త్రి

గాయత్రీ ఆశ్రమ ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల - 33
ప్రతులు - 1000
సర్వస్వామ్యములు : సురక్షితము
సృష్టి సంవత్సరము : 197,29,49,101
విక్రమాబ్దము : 2057
దయానందాబ్దము : 177
శ్రీ విక్రమ - కార్తీక పౌర్ణమి (2000)
మూల్యము : రూ. **6=00** (తపాల ఖర్చులు అదనము)

తపాల ద్వారా ప్రతులకు

1. శ్రీ బాసెట్టి సత్తయ్య ,జె-38, రాంగోపాల్‌పేట్, సికింద్రాబాద్ - 500 003.

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమము, వ్యాస్ వైదిక సేవా సమాజము
12-10-586/6, వ్యాస్‌నగర్, (ఇందిరానగర్ రోడ్డు, నెం. 2)
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 500 061.
2) మాశెట్టి శ్రీనివాస్, Shop No. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740 , కంచరి బజార్, సికింద్రాబాద్ - 3. ఫోన్ : 781 290
3) ఆర్ష గురుకులము, వడ్లూరు, కామారెడ్డి - 503 111 (నిజామాబాద్ జిల్లా
4) వైదిక సాహిత్యభండార్, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 95.
5) ఆర్. కృష్ణమూర్తి, బుక్ సెల్లర్, ఆర్యసమాజము,
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61.

Designed & Printed at :
PRINTSHOP
Sec'bad. Ph : 7812904

ఓం ఖం బ్రహ్మ

# అథ సత్య ధర్మవిచారః
## (చాందాపూరు మేలా.)

-:0:-

పెద్ద పెద్ద విద్వాంసులు ★ ఆర్యుల - క్రైస్తవుల - మహమ్మదీయుల తరపున సత్య నిర్ణయమునకై, ★ మేలా చాందాపూరులో సమావేశమై చర్చించిన ధర్మచర్చ- బ్రహ్మవిచారము, ప్రతి మతముయొక్క అభిప్రాయము అందరికీ విశదమగు నటుల సజ్జనులగు పాఠకుల హితమునకై ప్రకటింపబడుచున్నది. ఏ మతమునకు చెందిన వారైనను సజ్జనులందరు పక్షపాత రహితులై సుహృద్భావముతో దీనిని చూచెదరుగాక!

ఈ తిరనాళ్లు రెండు దినములు జరిగినది. ఉత్సవ మారంభం కాకపూర్వమే చాలామంది స్వామిగారిని సమీపించి ఆర్యులు - మహమ్మదీయులు కలిసి క్రైస్తవులను ఖండించుట మంచిదని చెప్పిరి. కాని దీనికి స్వామిగారు ఈ సమ్మేళనము సత్యాసత్య నిర్ణయమునకై జరిపించబడుచున్నది. కావున మనము ముగ్గురము కలిసి పక్షపాత రహితులమై సత్యమును నిర్ణయించవలయునేగాని ఎవరినైనా విరోధించుట ఉచిత మెన్నటికి కాజాలదని నుడివిరి.

---

★ ఇది 1877 మార్చి 19, 20 తేదీలలో (చైత్ర శు॥ 5,6) జరిగెను. ఇందు పాల్గొనుటకై మహర్షి 11వ తారీఖుననే శాహజహాన్పూరు (యు.పి) చేరిరి. (కేశవార్య)

★ ఈ ధర్మచర్చలలో ఆర్యులవైపున స్వామి దయానంద సరస్వతి మున్శీఇంద్రమణి గారలు క్రైస్తవుల తరపున ఫాదరు స్కాటుదొర, ఫాదరు నోబులుదొర, ఫాదరు పార్కర, జాన్సను దొరలు, మహమ్మదీయుల పక్షమున మౌల్వీ ముహమ్మదు కాసిమ్ సాయిబు, సయ్యదు అబ్దులు, మంసూరు సాయిబు గారలు పాల్గొని యుండిరి.

★ ఈ మేలా ప్రతి సంవత్సరము మున్శీ ప్యారేలాలుగారి ద్వారా జరుపబడుచున్నది.

అటు తరువాత శాస్త్ర విచారమునకై సమయము నిర్ణయించబడెను. ఫాదరీలు రెండు దినములకంటె నెక్కువ యుండజాలమని చెప్పిరి. అటులనే విజ్ఞాపన మందు ప్రకటించబడినది. దీని మీదట స్వామిగారు ఈ సమ్మేళనము 8 దినములకు మించకుండగను లేదా కనీసము ఐదు దినములైనను ఉండునని ప్రతిజ్ఞ చేసిన మీదనే నేమిచ్చుటకు వచ్చితి మనియు ఏలయన అన్ని మతముల అభిప్రాయములు ఇన్ని దినములలోగాని తెలియజాలవు అనియుననిరి. దీనికి వారు సమ్మతించ జాలరైరి. అప్పుడు మున్షీ ఇంద్రమణిగారు స్వామీజీ! మీరు నిశ్చింతగా నుండుడు. యదార్థ మతమొక్క దినములోనే వెల్లడి కాగలదు అని పలికిరి. అప్పుడు నిమ్న లిఖిత పంచ ప్రశ్నలను చర్చించుటకై అందరు స్వీకరించిరి.

## మొదటి దినపు సభ

మున్షీ ప్యారేలాల్‌గారు నిలబడి ముందుగా నందరితో నిటులనిరి:- సర్వ వ్యాపకుడు, సర్వాంతర్యామియగు ఈశ్వరునికి ప్రప్రథమముగ ధన్యవాదము లర్పించవలయును. ఏలయన మన మందరము నిర్విఘ్నముగ నిర్భయులమై మత మతాంతరముల విచారించుకొనుట కవకాశము కల్పించు రాజ్య ప్రబంధమున్న దినములలో ఆయన మనలను పుట్టించెను. ఇదంతయు మన అదృష్టము. మత మతాంతరముల నెఱిగి ప్రఖ్యాతి చెందిన సజ్జనులు, విద్వాంసులు ఇక్కడ సుశోభితులై యుండిన ఈ దినము ధన్యమైన దినము. విద్యాంసులందరు వారి వారి మత వార్తలను మృదు భాషణములలో చెప్పుదురనియు దాని వలన సత్యా సత్యముల నిర్ణయము జరుగుననియు, అందుచే మనుష్యులు సత్యమార్గమందు ప్రవృత్తులు కాగలుగుదురనియు అశయున్నది.

అటు తర్వాత మహమ్మదీయుల వైపునుండి, క్రైస్తవుల వైపు నుండి అయిదయిదుగురు చొప్పున నిర్ణయించబడిరి. ఆర్యులవైపు నుండి స్వామీజీ, మున్షీ ఇంద్రమణిగారు, ఇద్దరే మాటలాడుటకు నియమించబడిరి. అప్పుడు క్రైస్తవులు, మహమ్మదీయులు ఆర్యుల

దిక్కునుండి కూడ అయిదయిదుగురు కావలయునని పట్టు పట్టిరి. దానికి స్వామిగారు ఆర్యుల వైపునుండి మేమిరువురమే చాలుదుమని పలికిరి. అయినను ముసల్మానులు క్రైస్తవుల ద్వారా పండిత లక్ష్మణ శాస్త్రిగారి పేరు వారంతట వారే వ్రాయించదలచిరి. అంతట స్వామి గారు మీకు మీమీ తరపు మనుష్యుల పేరులు వ్రాయించుకొను నధికారమున్నది. కాని మావైపు అధికారములేదు అని యనిరి. పండితలక్ష్మణశాస్త్రిగారితో కూడ మీకు మాకు (మనలో మనకు) తగాదా పెట్టి వీరు తమాషా చూడగోరు చున్నారనియు చెప్పిరి. ఈ మాట అనిన తర్వాతకూడా ఒక మౌల్వీ పంతులుగారి చేయి పట్టుకొని మీరును మీ పేరు వ్రాయించుడు. వారు అంటే మాత్రము అయ్యే దేమున్నది? అని చెప్పుచుండగ స్వామిగారు మంచిది! ఆర్యులందరు సమ్మతించుచో వీరి పేరును వ్రాయించుడు. లేనిచో కేవలము మీరు చెప్పినంత మాత్రమున వీరి పేరు వ్రాయబడజాలదు అని యనిరి. ఇంతలో ఒక మౌల్వీ లేచి ఈ ఇద్దరి పేరులు వ్రాయించుట కందఱి సమ్మతి యున్నదో లేదో యని హిందువుల నందరిని అడుగ వలయునని పలికెను. అందులకు స్వామిగారు మిమ్ముల సున్నీ సంప్రదాయులు దప్ప షియా మొదలైన సంప్రదాయులు కోరి కూర్చొన బెట్టలేదు. అలాగుననే రోమను క్యాథలికు శాఖవారు ఫాదరీగారిని నిలబెట్టలేదు. అటులనే ఆర్యులందును మమ్ము నిలబెట్టుట కెందరో ఇష్టులుగను ఎందరో అయిష్టులుగను ఉండవచ్చును. అయినను మా మధ్య జగడము పెంచుటకు మీ కేమియు నధికారము లేదనిరి. మున్శీ ఇంద్రమణి గారిటులనిరి:- మేము ఆర్యులందరము వేదాది శాస్త్రముల మన్నించెదము. పంతులుగారును వీనినే స్వీకరించుచున్నారు. ఇక ఎవరైనా వేదాది శాస్త్రములకు విరుద్ధముగ, ఆర్యులతో కలియని వారు ఉండినట్లైన నాల్గవ సంప్రదాయమును స్థిరపరచి ఎవరినైనా ఎన్నుకొని కూర్చొనబెట్టిన పెట్టవచ్చును.

వీరిలో వీరు కలహించు కొనుచో మనము తమాషా చూద్దామని ఈ సంభాషణలోని మౌలీల అభిప్రాయమై యుండెను. పంతులు గారి

పేరు వ్రాయించుట ఆర్యులు ఉచితమని భావించలేదు. ఇంతలో మౌల్వీలు నమాజు చేసుకొనుటకు వెళ్లిరి. వారు తిరిగి వచ్చిన తర్వాత వారిలో మౌల్వీ ముహమ్మదు కాసిం సాయిబు గారిట్లనిరి:- ముందుగ ఒక గంట ఆ ప్రశ్నల విషయమే కాక కొద్దిగా స్వమతము ననుసరించి చెప్పదలచుచున్నాను. అందెవరికైనను ఏవైనా శంకా సందేహములు కలిగినచో వారికి సమాధానమిచ్చెదను. ఇందుల కందరు సమ్మతించిరి. మౌల్వీగారు చెప్పిన దాని సారాంశమిది:-

మౌల్వీ ముహమ్మదు కాసిం సాయిబు:- పరాత్పరుని స్తుతించిన పిమ్మట ఇటులనిరి. ఆయా సమయములందుండు అధికారులనే సేవించుట ఉచితము. ఇప్పుడున్న గవర్నరునే అందరు సేవించి యతని యాజ్ఞలను మన్నింతురు. కాని గతించినవారి యాజ్ఞలను ఎవరును పాలించరు. వినరు సుమా! రద్దు అయిన శాసనమును ఎవరును అనుసరించరు. కాని దానికి బదులుగ వచ్చిన శాసనము ననుసరించియే అందరు నడచెదరు. ఈ దృష్టాంతముల ననుసరించి వెనుకటి అవతార పురుషులు- దేవదూతలు; వారి సమయములలో వచ్చిన తౌరేతు జబ్బూరు బైబిలు మొదలైన పుస్తకములు ఇప్పుడు ఆచరణీయములు- ఆదరణీయములు కాజాలవు.

అందరికంటె వెనుక వచ్చిన పైగంబరు ఇప్పుడు మహమ్మదు గారు. వారినే దేవదూతగా భావించవలయును. వారి కాలమున దిగిన (లభించిన) ఈశ్వర వాక్యములగు కురాను మీదనే విశ్వాసముంచవలయును. మేము శ్రీ రామ కృష్ణులనుగాని, ఏసునుగాని నిందించము. ఏలయన వారును వారి వారి సమయములందు అవతార పురుషులును పైగంబరులును అయి యున్నారు. కాని ఈ సమయమున హజరతు మహమ్మదుగారి యాజ్ఞయే చెల్లుబడి యగుచున్నది. ఇతరులది కాదు. మా మతమునుగాని, కురాను షరీఫునుగాని, హజరతు మహమ్మదు గారినిగాని, దూషించువాడు చంపబడుటకు యోగ్యుడు.

ఫాదరు నోబులు దొర:- మహమ్మదు పైగంబరగుటకు, కురాను

ఈశ్వరీయ వాక్యములగుటకు సందేహమున్నది. కురానులో వ్రాయబడిన మాటలన్నియు బైబిలులోనివే. కావున కురాను ప్రత్యేకముగ ఆకాశ పుస్తకము కాజాలదు. అయినను ఏసు అవతార పురుషుడనుటకు సందేహము లేదు. ఆయన సత్యమార్గము బోధించుటకు వచ్చినటుల ఆయన ప్రవచనముల వలననే స్పష్టమగు చున్నది. వారి ప్రవచనముల వలననే మనుష్యుడు ముక్తి పొంద గలుగును. ఆయన చమత్కార (ప్రమాణ) ములనుకూడ చూపించియుండెను.

మౌల్వీ ముహమ్మదు కాసిము సాయిబు: - మేము ఏసును అవతార పురుషునిగను, బైబిలును ఆకాశ పుస్తకముగను ఒప్పుకొనెదము. కాని క్రైస్తవులు దానిని హెచ్చుతగ్గులు చేసిరి. కావున అది మూలము కాదు. దానిని కురానుయు ఖండించినది. ఈ కారణముచే నది విశ్వాస యోగ్యమైనది కాదు, మా హజరతు పైగంబరుగారి యవతారము అందరికంటె చివరిది. కావున మా మతమే యదార్థమైనది.

తర్వాత ఇతర మౌల్వీలు బైబిలునుండి యొక వాక్యమును, ఫాదరుగారికి చూపెట్టి ఇదిగో చూడండి! మీరే ఈ వాక్యమెక్కడిదో తెలియకున్నదని వ్రాసి యున్నారు అని యనిరి.

ఫాదరు నోబులు దొర- దీనిని వ్రాసినవాడు సత్యవాది. అతను లేఖకుని పొరపాటు బయట పెట్టినవాడు, చెడు ఏమియు చేయలేదు. మేము సత్యమునే కోరు వారము, అసత్యమును కోరము. కావున మా మతమే యదార్థమైనది.

మౌల్వీ ముహమ్మదు కాసిము సాయిబు: చెడు ఏమియు చేయలేదనుట సత్యమే వాని ఏదైనా పుస్తకములోగాని, దస్తావేజులోగాని, అసత్యమొక మాటయైనను వ్రాయబడియున్నచో అదంతయు ఎన్నటికి మాననీయము కాజాలదు. ఆ దస్తావేజు కోర్టులో చెల్లనేరదు.

ఫాదరు నోబులు దొర: - కురానులో వ్రాయనకాని తప్పు లుండవా?

దీనికై మొండిగ పట్టుకొని ఊగులాడుట తగదు. మేము సత్యమునే స్వీకరించెదను. సత్యమునకై అన్వేషించెదము. ఈ కారణముచే మేమూ లేఖకుని పొరపాటును ఒప్పుకొనుచున్నాము. మీ కురానులోనే చాలా హెచ్చుతగ్గులు చేయబడినవని అని అనిరి. ఈ విషయమును బలపరచుచు క్రైస్తవుడుగా మారిన ఒకమౌల్వీ అరబ్బీ భాషలో ఎక్కువగా మాటలాడి కురాను ప్రకరణములనుకూడా ప్రమాణములుగ చూపెట్టెను.

మౌల్వీ ముహమ్మదు కాసిము సాయిబు:- మీరు గొప్ప సత్యాన్వేషకులు! (ముఖము చిట్లించుకొనుచు) మీరు సత్యమునే స్వీకరించువారగుచో ముగ్గురు ఈశ్వరులను ఎందుకు భావించుచున్నారు?

పాదరునోబులు దొర: మేము ఈశ్వరులు ముగ్గురని ఒప్పుకొనము. ముగ్గురును ఒకటే. కేవలము ఒక్క ఈశ్వరునితోనే ప్రయోజనము. యేసునందు మానవత్వము, ఈశ్వరత్వము రెండును ఉన్నవి. కావున ఆయన రెండు వ్యవహారములను చేయును. మనుష్యుని ఆత్మవలన మనుష్యుని వ్యవహారములను, ఈశ్వరుని ఆత్మవలన ఈశ్వరుని వ్యవహారములను ఒనర్చును. అనగా మహిమలను చూపించును.

మౌల్వీ ముహమ్మదు కాసిం:- వహ్వారే! ఒక ఒరలో రెండు కత్తులెటుల ఇమడగలవు? పాదరీ గారిటుల మాటలాడుట బొత్తిగా అబద్ధము. యేసు స్వయముగ నెచ్చటను నేను ఈశ్వరుడనని చెప్పలేదు. మీరే హఠముచే అతనిని ఈశ్వరునిగ చేయుచున్నారు.

పాదరు నోబుల దొర:- బైబిలు వాక్యమొకటి చదివి, ఇందాయన తనను ఈశ్వరుడని చెప్పుకొని యుండుటయేగాక చాలా చమత్కారములను చూపియుండెను. కావున ఆయన ఈశ్వరుడగుటకు సందేహమేమియు లేదని చెప్పెను.

మౌల్వీ ముహమ్మదు కాసిము సాయిబు:- ఆయన ఈశ్వరుడే యగుచో శిలువలనుండి తనను తాను రక్షించుకొన జాలక పోయెనేమి?

ఒక భారతీయ పాదరు:- కురానులోని వాక్యముల నెన్నిటినో

పరస్పర విరుద్ధములగు వానిని చూపించెను. ఆజ్ఞలు ఖండించబడవచ్చును గాని సువార్త ఖండించబడజాలదు. మీ కురానులో సువార్తల ఖండనయున్నది. వెనుకటి రోజులలో మీరు పవిత్రబైతులు వైపుకు తల వంచేవారు. తర్వాత కాబావైపుకు మొక్క సాగిరి అని చెప్పెను. చాలా కురాను వాక్యముల చదివి అర్థముకూడ వినిపించెను. క్రీస్తుని విశ్వసించనిదే ఎవరికిని ముక్తి లభింపనేరదనియు, మీకురానులోనే బైబిలును; యేసును స్వీకరించుడనియు వ్రాసియుండగ మీరేల విశ్వసించుటలేదు? అని నుడివిరి. ఇటువంటి మాటలతోనే సాయంకాలమయ్యింది.

## -:రెండవనాటి సభ:-

ఉదయం వేడున్నర గంటల కందరు వచ్చిరి. అందరిచే నామోదించబడిన ఐదు ప్రశ్నలు చదవబడినవి. అవి యివి:

1. పరమేశ్వరుడు సృష్టిని ఏ వస్తువుతో? ఎప్పుడు? ఎందుకు సృజించెను? 2. ఈశ్వరుడు సర్వవ్యాపకుడగునా కాదా? 3. ఈశ్వరుడు న్యాయకారి దయాళువు ఎటుల? 4. వేదము, బైబిలు, కురానులు ఈశ్వరోక్తము లనుటకు ప్రమాణమేమి 5. ముక్తియనగ నేమిటి? అది ఏ విధముగ లభించును?

తర్వాత కొంత కాలము వరకు వారిలో వారు, ముందువారు వర్ణించెదరు- వీరు వర్ణించెదరు అని వంతులుపోయిరి. తదనంతరము ఫాదరు స్కాటుగారు మొదటి ప్రశ్నకు ఉత్తరము చెప్ప నారంభించుచు, ఈ ప్రశ్న ఎందుకు పనికిరాదనియు, ఇటువంటి ప్రశ్నల కుత్తరములిచ్చుట నా దృష్టిలో వ్యర్థమనియు, అయినను అందరు దీనిని ఆమోదించియుండుటచే దీనికే సమాధానము చెప్పుచున్నానని అనిరి.

ఫాదరు స్కాటు దొర:- ఈ ప్రపంచ మేవస్తువు వలన తయారైనదో మాకు తెలియదు. కాని అభావమునుండి భావమును కలుగచేయునని మాత్రము చెప్పగలము. ఏలయన పూర్వము ఈశ్వరుడు తక్క రెండవ పదార్థమేమియు లేకుండెను. అతడు తన ఆజ్ఞచే సృష్టిని సృజించెను.

ఆయన ప్రపంచమును ఎప్పుడు రచించినదియు మేమెరుగము. దానికి ఆరంభం మాత్రమున్నది. కాని సంవత్సరముల లెక్క మాకు తెలియదు. ఈశ్వరునికి దక్క మరెవ్వరికి తెలియదు. కావున ఈ విషయము మీద నధికముగ మాటలాడుట ఉచితముగాదు.

ఈశ్వరుడీ జగత్తును ఎందులకు రచించెను? దీనికి సరైన జవాబు మేమెరుగము. అయినను మనమందరము సుఖము పొందవలయునని, ప్రపంచ సుఖము కొఱకే ఈశ్వరుడీ సృష్టిని సృజించియుండెనని మాత్రమే ఎరుగుదుము.

మౌల్వీ మహమ్మదు కాసిము సాయిబు:- ఆయన తన శరీరమునుండి పుట్టించెను. అతనినుండి మనము వేరుగాము. వేరగుచో నతని ప్రభుత్వములో నుండము. ప్రపంచమెప్పుడు సృజింపబడితేనేమి? రొట్టె తినుటయే మనకు గావలసినది కాని రొట్టె ఎప్పుడు తయారైనదని ప్రశ్నించుట కాదు.

ఈ జగత్తు సృష్టికొరకు రచింపబడినది. పదార్థముల నన్నిటిని మనుష్యుల కొరకు ఈశ్వరుడు రచించెను. మనలను తన భక్తి కొరకు పుట్టించెను. భూమి మనకొరకు గాని మనము భూమి కొరకు గాదు. ఏలయన మనము లేనిచో భూమికి నష్టమేమియు లేదు. భూమిలేనిచో మనకెంతయో నష్టము కలుగుచున్నది. ఇటులనే నీరు నిప్పు గాలి మొ॥ పదార్థములన్నియు మనుష్యుని కొరకు సృజింపబడినవి. మనుష్యుడు సృష్టియంతటిలో శ్రేష్ఠుడు. ఈ శ్రేష్ఠత్వపరీక్షకై అతనికి బుద్ధి ఇవ్వబడియున్నది. అనగా మానవుని తన భక్తి కొరకును, ఈ ప్రపంచమును మనుష్యుని కొరకును ఈశ్వరుడు సృజించియుండెను.

స్వామి దయానంద సరస్వతి:- ముందుగా మహమ్మదీయులందరికి క్రైస్తవులందరికి, శ్రోతలందరికి నేను విన్నవించునదేమనగా:- ఈ మేళా కేవలము సత్య నిర్ణయమునకై చేయబడినది. మతము లన్నిటిలో సత్యమతమెద్దియో తెలుసుకుని దానిని అంగీకరించవచ్చునని యే ఈ సమ్మేళన కర్తల యాశయము-

ప్రయోజనమునై యున్నది. కావున ఇచ్చట జయ పరాజయముల నెవరును కోరనే గూడదు. సదా సత్యమునకే జయము, అసత్యమునకు పరాజయము కలుగవలయుననియే సజ్జనుల యభిమతమై యుండవలయును. ఫాదరు ఈ మాటలను అబద్ధముగ చెప్పెనని మౌల్వీలును, మౌల్వీలు ఈ మాట అబద్ధము చెప్పిరని క్రైస్తవులును అనుచున్నారు. ఇటులనుట తగదు. వారి వారి జ్ఞానములనుబట్టి విద్యల ననుసరించి మృదువాణితో అసత్యమును ఖండించి సత్యమునే బలపరచవలయునని విద్వాంసుల మధ్య ఒక నియమముండవలయును. ఇటుల అందరును కలిసి ప్రేమతో సత్యమును ప్రకాశ పరచవలయును. ఒకరి నొకరు నిందించుకొనుట, చెడు మాటలు పలుకుట, ద్వేషముతో నేను గెలిచితిని, ఇతను ఓడెనని అను పద్ధతి ఎన్నటికి నుండకూడదు. అన్ని విధముల పక్షపాతమును వదిలి సత్యభాషణ మొనరించుట అందరికి ఉచితము. ఒకరినొకరు విరోధ వాద మొనర్చుట అవిద్వాంసుల స్వభావము, ఇది మంచిది కాదు. ఈ మేళాలోనే గాని ఇతరత్రాగాని కఠోరముగ భాషణ మొనర్చుట కూడదని- నా అభిప్రాయము.

ఈశ్వరుడు ప్రపంచమును ఏ వస్తువుతో- ఎప్పుడు- ఎందుకు సృజించెను? అను మొదటి ప్రశ్నకు నాకున్న చిన్న బుద్ధిని విద్యననుసరించి జవాబిచ్చెదను.

అవ్యక్తము- అవ్యాకృతము- పరమాణువు అను పేరులతో పిలువబడు ప్రకృతిద్వారా ఈ ప్రపంచమును దేవుడు రచించెను. ఇదియే జగత్తునకు ఉపాదాన కారణము. వేదాది శాస్త్రములలో అది నిత్యమని నిర్ణయింపబడినది. ఇది సనాతనము. ఈశ్వరుడనాది యైనటులనే సర్వజగత్కారణమును అనాదియే. దేవునికి ఆద్యంతములు లేనటులనే ఈ జగత్కారణమునకును ఆద్యంతములు లేవు. ఈ జగత్తున కనబడు పదార్థములన్నిటి కారణ రూపములో నొక పరమాణువుకూడా ఎన్నటికిని పెరగదు. తరగదు. దేవుడు ఆదిలో కారణమునుండి కార్య రూపముగ నీ జగత్తును రచించుచున్నాడు. ఈ కార్య జగత్తువలెనే దీని కారణమును ఉన్నది. సూక్ష్మ ద్రవ్యములను సంయోగ మొనరించి స్థూలద్రవ్యముగ

చేయుచున్నాడు. స్థూలద్రవ్యమైనప్పుడే చూచుటకు, వ్యవహరించుటకు యోగ్యమైనది యగు చున్నది. అనేక విధములుగ కనబడు ఈ ప్రపంచమును ఆ కారణ రూపమునుండియే దేవుడు రచించెను. ప్రళయకాలమున ఈ స్థూల జగత్తుయొక్క సమస్త పదార్థములందలి పరమాణవులను వేరు పరచును. స్థూలమునుండి సూక్ష్మమగుచున్న కొలది కండ్లకు కనబడకుండ పోవును. అప్పుడు బాల బుద్ధిగలవారు ఆ ద్రవ్యము లేదని భావించెదరు. కాని అది సూక్ష్మమై ఆకాశములోనే ఉండును. కారణమెన్నటికి నశింపదు. నాశనమున యదర్శనము, చూచుటకు కనబడనిది యని భావము, ప్రతి పరమాణువు విడిపోయినప్పుడు ★ దర్శనము కాజాలదు. మరల ఆ పరమాణువులే కలిసి స్థూలాకారమును దాల్చినప్పుడు దృక్పథమునకు వచ్చుచున్నవి. ఈశ్వరుడెప్పటినుండియో ఇటుల ఉత్పత్తి నాశనములను చేయుచున్నాడు. ఇక ముందును చేయును. దేవుడెన్నిసారులు సృజించెను? ఎన్నిసారులు సృజించును? అనునది లెక్కలేదు. ఎవరును చెప్పజాలరు. అభావమునుండి అస్తి అనగా భావమును ఒప్పుకొనువారి మరియు శబ్దమువలన జగదుత్పత్తియైనదని తలచువారి, మంతవ్యము సరియైనది కాజాలదు. వంధ్యాపుత్రుని పెండ్లి కండ్లార చూచితినని యొకడనిన పుత్రుడు కలిగినప్పుడు వంధ్యత్వ మెటులుండును? ఆమెకు పుత్రుడే లేనప్పుడతని పెండ్లి యెటులగును? నేనచ్చటను లేకుండగనే ఇచ్చటకు వచ్చితిని అని యనుట. పాము పుట్టలో లేదు. పుట్టనుండి వచ్చినదని యనుట. ఇవి విద్వాంసుల పలుకులు కాజాలవు, ఇందుకు ప్రమాణమేమి లేదు. లేని వస్తువు ఎటుల వచ్చును? మనము మన మన స్థానములందు లేకున్నచో చాందాపుర మెటుల వచ్చియుందుము? శాస్త్రము లందిటులున్నది వినుడు.

---

★ చాలా సూక్ష్మమైన వస్తువును ఇంకా సూక్ష్మముగ నొనర్చుట అసంభవము. ఇటుల ముక్కలగుట అసంభవమగు పరిస్థితికి వచ్చు వరకు చిన్న చిన్న ముక్కలుగా చేయుచో దానిని పరమాణువు అందురు. ప్రపంచములోని వస్తువులన్నియు పరమాణువుల వలన తయారగు

నా సత ఆత్మలాభః । న సత ఆత్మహానమ్॥

ఉన్నది ఇక ముందు కూడ నుండును. లేనిది ఎన్నడును లేనే లేకుండును. భావము లేనిదే భావము కాజాలదని దీని వలన స్పష్టమగు చున్నది. ఈ జగత్తునందు కారణము లేని వస్తు వెద్దియు లేదు. భావమునుండి భావము, అస్తినుండి అస్తి కలుగుచున్నదనియు, నాస్తి నుండి భావమేవిధముగను కాజాలదనియు, రుజువగుచున్నది. దీనికి విరుద్ధముగ స్థిరపరచుట 'వదతో వ్యాఘాతః' తన మాటను తానే ఖండించుకొని నటులగును. ముందుగా ఏ వస్తువునైనా అన్యథా భావముగ చెప్పి మరల దానికి భావమేర్పడినదని యనుట పూర్వాపర విరోధము. విద్వాంసులెవరు దీనిని స్వీకరించరు. కారణము లేనిదే కార్యము కాగలదని యే ప్రమాణముచేతను ఋజువు కాజాలదు. కావున అభావమునుండి భావము అనగా నాస్తి నుండియో, ఆజ్ఞా మాత్రముననో జగదుత్పత్తి జరుగుట సర్వథా అసంభవము, కావున ఈశ్వరుడే జగత్తుయొక్క అనాదియగు ఉపాదాన కారణము నుండియే సమస్త సృష్టిని రచించెననియు వేరుగా గాదనియు యెరుగవలయును.

ఇక్కడ రెండు రకముల విచారణలు కలుగుచున్నవి. జగత్తునకు దేవుడే కారణమగుచో సమస్త జగత్తుయొక్క రూపము దేవుడేయయ్యెను. అప్పుడాతనియందు కించజ్ఞత్వము, సుఖ దుఃఖములు, జన్మ మరణములు, హాని లాభములు, నరక స్వర్గములు, క్షుధ, తృష, జ్వరాది రోగములు, బంధమోక్షములు సర్వమూ ఆరోపించబడును.

---

చున్నవి. ఒక రాతిని పగులగొట్టి చిన్న చిన్న ముక్కలను వేరు చేయుచో కలుగు పరమాణువులను సంయోగ మొనర్చుచో రాయియగును. ఆ పరమాణువు లేదో యొక రూపములో సదా స్థిరములై యుండును. ఒక్క పరమాణువుకూడ ఈ ప్రపంచమునుండి అభావము చెందదు. స్వరూప గుణములందు కేవలము భేదము (మార్పు) కలుగును. మైనపు వత్తిని వెలిగించినచో కొద్ది కాలములో వత్తి ఏమగునో కాని కనబడకుండ పోవుట గాంచుచున్నాము. ఈ క్రియ వలన వత్తిలోనుండి పరమాణువులు వేరు రూపములో వాయు సదృశము లగుచున్ననే కాని వానిలోనుండి ఒక పరమాణువుకూడ అభావమెన్నటికి కాజాలదు.

అదియునుంగాక కుక్క, పిల్లి, దొంగ, దుష్టుడు మొదలైన ప్రాణులన్నియు దేవుడేయగును.

రెండవది:- సామగ్రి వేరుగా ఉందని భావించుచో దేవుడు ఒక నిర్మాత మాదిరిగా నుండును. దీని వ్యాఖ్యాన మిటులుండును. కారణములు త్రివిధములు, ఒకటి ఉపాదానకారణము, దీనిని ఉపయోగించి కార్యరూప పదార్థము సృజింపబడును. మట్టియుంటేనే కుండలు, బంగారం ద్వారా.నగలు, దూదివలన బట్టలు తయారు చేయబడుచున్నవి. (వానికవి ఉపాదాన కారణములు)

రెండవది నిమిత్త కారణము:- కుమ్మరివాడు తన విద్యా సామర్థ్యములవలన కుండను తయారు చేయుచున్నాడు. (కాని స్వయముగ కార్యరూపమును దాల్చుట లేదు) మూడవది సాధారణ కారణము, కుమ్మరి సాన మొ॥ సాధనములు దిక్కాలాదులు మొదలగునవి.

దేవుడు జగత్తున కుపాదాన కారణమని భావింపబడుచో దేవుడే జగద్రూపమగును. మట్టి- కుండ వేరువేరు పదార్థములు కాజాలవు గదా! దేవుని నిమిత్త కారణముగ భావించుచో కుమ్మరి మట్టి యుంటేనే గదా కుండలు చేయునది. (కావున ఉపాదాన కారణమింకొకటి యుండి తీరవలయును) దేవుని ఉపాదాన కారణముగ భావించినట్లైతే కుమ్మరి లేనిదే తనంతట తాను మట్టి కుండగా కాజాలదు. ఈరెండు పరిస్థితులలోను అతడు (నిమిత్త కారణమైతే) పరాధీనుడుగనో, (ఉపాదానమగుచో) జడముగనో తలచబడవలసి యుండును. కావున దేవుడే జగద్రూపమయ్యాడని చెప్పువారి కథ నానుసారము దొంగ మొ॥ దోషములన్నియు నీశ్వరుని యందారోపింపబడును. ఇందువల్ల జగత్కారణము అనాదియనియు, నానా విధముల జగత్తును సృజించువాడు పరమాత్మయనియు, ఇదేవిధముగ జీవుడును తన స్వరూపముచే అనాదియనియు, స్థూలమగు కార్య జగత్తు, జీవుల కర్మలు, నిత్య ప్రవాహమువలె అనాదులనియు ఒక వ్యవస్థను స్వీకరించ వలయును. ఇటుల స్వీకరించకుండా ఇంకో విధముగా నిర్వాహము కాజాలదు.

ఈశ్వరుడు ఎప్పుడు జగత్తును సృష్టించెను? ప్రపంచము పుట్టి ఎన్ని సంవత్సరములైనది? అను ప్రశ్నకు సమాధాన మియ్యబడుచున్నది. భ్రాతలారా! వినుడు! దీనికి జవాబు మేము ఇవ్వగలము. మీరు ఇవ్వజాలరు. మీలో ఒకరు 18 వందల సంవత్సరముల నుండి, మరొకరు 13 వందల సంవత్సరములనుండి, ఇంకొకరు ఐదువందల సంవత్సరముల నుండి ఉత్పత్తి జరిగినదని చెప్పుదురు. అదియునుగాక మీ మతములందు జగదితిహాసపులెక్క ఏవిధముగను కట్టబడజాలదు. ఆర్యులమగు మేము సృష్టి జరిగినప్పటి నుండి నిరంతరము విద్వాంసుల మగుచు వచ్చితిమి. ఇంతియగాదు, ఈ దేశము నుండియే సమస్త దేశములకు విద్య వ్యాపించినది. ఆర్యావర్తము నుండి ఐగుప్తు దేశమునకు, అటనుండి గ్రీసుకు, గ్రీసునుండి యూరోపు మొ॥ దేశములకు విద్య వ్యాపించి యుండెననుటకు అన్ని దేశముల వారి ఇతిహాసము ప్రమాణమై యున్నది. కావున నీ యితిహాస మితర మతములందుండదు.

వినుడు! మేము- ఆర్యులము సృష్టియొక్క ఉత్పత్తి ప్రళయముల గురించి వేదాది శాస్త్రములద్వారా ఎన్నడో ఎరిగియున్నాము. వెయ్యి చతుర్యుగములు బ్రహ్మకొక దినము. ఇన్ని సంవత్సరములే బ్రహ్మరాత్రియు నుండును. జగదుత్పత్తి మొదలుకొని ప్రళయము వరకుండు సమయమును బ్రహ్మ దినమందురు. ప్రళయమైన తర్వాత వేయి చతుర్యుగముల వరకు ఉత్పత్తి జరుగదు. దానినే బ్రహ్మరాత్రి యందురు. ఒక కల్పములో 14 మన్వంతరములున్నవి. ఒక్కొక్క మన్వంతరమునకు 71 చతుర్యుగములున్నవి. ఇప్పుడేడవ మన్వంతరము జరుగుచున్నది. ఇంతకు పూర్వమారు మన్వంతరములు జరిగినవి. వాని పేరులు స్వాయంభువ, స్వారోచిష, ఔత్తమి, తామస, రైవత, చాక్షుషులు. ఇప్పటికి 196 08 52 976 సంవత్సరములు గడిచినవి. ఇక 233 32 27 024 సంవత్సరములు జరుగనున్నవి. ఇది మన దేశ చరిత్రలో యథార్థ క్రమముగ వ్రాయబడి యున్నది. జోతిష శాస్త్రములో కూడ తిథి వార మాస సంవత్సరముల తగ్గింపు పెంపుచేయుచు వచ్చిరి. జ్యోతిషము ననుసరించి తయారగు పంచాంగము నందును యథావత్తుగ అన్నిటిని

క్రమముగ పేర్కొనుచున్నారు. అనగా భుక్త భోగ్య వత్సరము లందొక్కొక్కటి చొప్పున హెచ్చించుచు తగ్గించుచు వచ్చిరి. ఈ విషయమునందు ఆర్యావర్తపు ఇతిహాసము లన్నియు నొక్కటియె, ఎందును విరోధము లేదు.

జైనులు ముసల్మానులు ఈ దేశపు ఇతిహాసమును నష్టము చేయ సాగినప్పుడు ఆర్యులు సృష్టి యితిహాసమును కంఠస్థము చేసుకొనిరి. దానిని ఆ బాలవృద్ధులు నిత్య ప్రతి సంకల్పము పేర ఉచ్చరించుచున్నారు. అది ఇది.

ఓం తత్సత్ శ్రీ బ్రహ్మణో ద్వితీయే ప్రహరార్ధే వైవస్వత మన్వంతరేఽష్టావింశతితమే కలియుగే కలిప్రథమ చరణే ఆర్యావర్తాంతరై కదేశేఽముకనగరేఽముక వత్సరాయనర్తు మాస పక్ష దిన నక్షత్ర లగ్న ముహూర్తేఽత్రేదం కార్యం కృతం క్రియతే వా.

దీనిని విచారించినను సృష్టిగణన సరిగ తెలియగలదు. అప్పటికి ఎవరైన దీనిని ఒప్పుకొన జాలమనినచో వారికి జవాబు ప్రతి దినము తిథి వారములను వ్రాసుకొనుచు వచ్చిన ఖాతా పుస్తకమును ఎవరు అబద్ధము అని అనజాలరు. అటులనే ఇది. పరంపరగా తిథి వార దినములను పెంచుచు జ్యోతిషము ఇతిహాసము మొ॥ శాస్త్రములన్నింటిలో వ్రాయబడి యుండగ దీనిని మిథ్య యని ఎవరనగలరు? మిథ్య యను వారిని మీ మతములో సృష్ట్యుత్పత్తియై ఎంత కాలమైనదని ప్రశ్నించుచో వారేమి జవాబిచ్చెదరు? అతనుకూడా తన పుస్తకముల నాధారము చేసుకొని ఆరో, ఏడో లేక ఎనిమిదియో వేల సంవత్సరములని చెప్పును. అదియు పుస్తక విషయమే. దానిని స్వీకరించుట సత్యమెటుల యగును?

భూగర్భ విద్యవలన గూడ ఆర్యుల గణనయే సరియైనదని తెలియుచున్నది. ఇందువలన మా మతమునందు సృష్టి సంవత్సరములు లెక్కకు రాగలుగుచున్నవి. ఇతరుల మతము నందెన్నటికి రాజాలదు. ఇందువల్ల అందరును సృష్టియొక్క ఈ వ్యవస్థనే సరియైనదని స్వీకరించుట సముచితము.

ఇక ఈశ్వరుడు సృష్టిని ఎందుకు సృజించెననుటకు జవాబివ్వబడుచున్నది.

జీవులు మరియు జగత్తుయొక్క కారణము (ప్రకృతి) స్వరూపముతోనే అనాదులు. జీవుని కర్మలు మరియు కార్య జగత్తు నిత్య ప్రవాహమువలె అనాదులు. ప్రతి ప్రళయ సమయమున జీవుల కర్మలు కొన్ని శేషించి ఉండిపోవును. వానిని భోగింపజేయుటకు - ఫలమొసంగుటకు ఈశ్వరుడు సృష్టిని రచించి పక్షపాత రహితమగు తన న్యాయమును ప్రకటించుచున్నాడు. దేవునికి బలము, జ్ఞానము, దయ ఉన్నవి. సృజించు మహోత్తమ శక్తియు నున్నది. వాని నన్నిటిని సఫలమొనర్చుటకు సృష్టిని రచించెను. కన్ను చూచుటకు, చెవి వినుటకు ఉన్నది. అటులనే (దేవునియందు) రచనాశక్తి రచించుటకు ఉన్నది. కావున ఈశ్వరుడు తన సామర్థ్యమును సఫలమొనర్చుటకై ఈ జగత్తును రచించెను. అందరు అన్ని పదార్థముల వలన సుఖము పొందవలయునని అతని ఆశయము. ధర్మార్థ కామ మోక్షముల సిద్ధికై జీవునికి నేత్రాది సాధనములు రచించబడినవి. ఇదే విధముగ సృష్టి రచన యందనేక ప్రయోజనము లున్నవి. సమయాభావముచే వాని నిచ్చట చెప్పజాలకున్నాను. విద్వాంసులు స్వయముగ గ్రహించగలరుగాక!

ఫాదరీ స్కాటు దొర:- హద్దు కలది అనాది కాజాలదు. జగత్తుయొక్క సీమ నిరూపితమైయున్నది. అది అనాది కాజాలదు, ఏ పదార్థమూ తనకు తానే సృజింపబడదు. కాని ఈశ్వరుడు జగత్తును తన సామర్థ్యముచే రచించెను. ఈశ్వరుడు ఏపదార్థముచే రచించెనో ఎవరును ఎరుగరు. పండితులును ఏ పదార్థముచే జగత్తును రచించెనో చెప్పలేరు.

మౌల్వీ కాసిం సాహెబు:- పదార్థములన్నియు పూర్వపు నుండియే యుండియున్నచో ఈశ్వరుని స్వీకరించుట వ్యర్థము, ఉత్పత్తి సమయమును ఎవరు చెప్పజాలరు.

స్వామి దయానంద సరస్వతిగారు:- (ఫాదరీ దొరకు ప్రత్యుత్తరముగ) ఫాదరీగారు నా మాటలను మీరు తెలుసుకొన జాలక

పోయిరి. నేను కేవలము జగత్కారణమునే అనాదియని చెప్పుచున్నాను. కార్యమెన్నడును అనాది కాజాలదు. మూడున్నర మూరలున్న నాయీ శరీరము పుట్టుకకు పూర్వమిటుల లేదు. నాశనమైన తర్వాతను ఇటులుండదు. కాని ఇందున్న పరమాణువు లే మాత్రమును నశించవు. ఈ శరీరపు పరమాణువులు వేర్వేరై ఆకాశములో ఉండనే ఉండుచున్నవి. ఆ పరమాణువులలో నుండు సంయోగ వియోగశక్తి వానిలో నెల్లప్పుడు ఉండుచునే యున్నది. ★ మట్టినుండి కుండ తయారుచేయబడుచున్నది. కాని అది తయారగుటకు పూర్వమును, నశించిన తర్వాతను ఉండదు. అందున్న మట్టి నశించునది కాదు. ఆ మట్టిని పిండాకారమొనరించు స్నేహమను గుణము కూడ మట్టిలో సదా యుండుచునే ఉన్నది. ఇటులనే సంయోగ వియోగములగు యోగ్యత పరమాణువులందు సదా ఉండి యున్నది. అనాది ద్రవ్యములగు పరమాణు ద్రవ్యములచే ఈ జగత్తు సృజింపబడినది. కార్య ద్రవ్యము అనాది కాదు. జగత్తులోని పదార్థములు తమంతట తామే సృజింప బడుచున్నవని నేనెప్పుడంటిని? ఉపరోక్త కారణము నుండియే పరమాత్మ ఈ జగత్తును సృజించెనని చెప్పి యుంటిని.

శక్తివలన జగత్తును రచించెనని ఫాదరు చెప్పిన దానిని గురించి నేను (ఒక ప్రశ్న) అడుగుచున్నాను. శక్తి ఏదైనా వస్తువా కాదా? అవుననినచో నది యనాదియైనది. లేదన్నట్లైతే దాని తర్వాత ఇతర వస్తువెద్దియు కాజాలదు. ఈ జగత్తుదేనివల్ల తయారైనదో పండితులుగారు చెప్పలేదని

---

★ అగ్నిలో అనేక పదార్థములు కాలిపోవుట అందరెరిగిన విషయమే. అయితే కాలిపోయినప్పుడా పదార్థములు ఏమగుచున్నవి? అనునది విమర్శనీయాంశము. ఒక పుల్ల కాలితే కొద్దిగా బూడిద మిగులుట అందరము చూచుచున్నాము. ఆ పుల్ల కాలి నశించిపోయినదా లేక దాని స్వరూపము మారిపోయినదా? అనునది విచారించవలయును. మైనపువత్తియు కాలిపోయిన తర్వాత ఏమియు కనబడకుండ పోవుచున్నది. మైనము ఉండదు. అది ఎక్కడకు వెళ్లినదో తెలియదు. కాని మైనపు స్వరూపము మారి వాయువు సదృశ మగుచున్నది. ఈ కారణము వలననే, వాయువులో మిశ్రిత మగుటచే కనబడకున్నది.

ఫాదరుగారనిరి. బహుశా వారు నా మాటలు వినియుండక పోవుటచే అటుల అని యుండవచ్చును. దేనినుండి ఈ కార్యజగత్తు తయారైనదో ఆ వస్తువును ప్రకృతి వెు॥ పేరులతోను పరమాణువు అనియు కొందరందురని పేర్కొనియుంటిని.

మౌల్వీగారికి జవాబు: సమస్త పదార్థముల కారణము అనాదియైనను ఈశ్వరుని ఒప్పుకొనుట అవసరము. ఏలయన మట్టిలో స్వయముగ కుండ యగు సామర్థ్యమెచ్చట యున్నది? కారణమెన్నడును స్వయముగ కార్య రూపము కాజాలదు. దానికి తయారగు జ్ఞానముండదు. జీవనముకూడ దానిని నిర్మించజాలదు. నాయీ రోమమును బోలు వస్తువును నేటి వరకెవరును నిర్మించియుండలేదు. పరమాణువులను పట్టుకొని యే యుపాయము చేతనైనను ఇటువంటి వస్తువును తయారు చేయగలిగినవాడు లేకుండెను. నేటికిని లేదు, రెండు త్రస (అతిసూక్ష్మ) రేణువులను కూడ ఎవరును సంయోగ మొనరించజాలరు. కావున ఈ జగత్తును రచించుట కాపరమేశ్వరునికి మాత్రమే సామర్థ్యమున్నదని గ్రహించవలయును.

---

దీనిని మనమిటుల గమనించవచ్చును. ఒకసీసాలోపల మైనపు వత్తి వెలిగించి మూత పెట్టుము. ఆ వత్తిలో వాయు సదృశమైనంత భాగము బయటకు పోకుండా సీసాలోనే ఉండును. కాని కొద్ది కాలము తర్వాత ఆ వత్తి ఆరిపోవుట గాంచుదుము. అయితే వత్తి ఎందుల కారిపోయినది? సీసాలోని గాలియందు మార్పు ఏమైనా కలిగెనా లేదా? అనునది విచారించవలసి యున్నది.

దీని పరీక్ష ఇటులొనర్చ వచ్చును. కొద్దిగా సున్నపునీరు తీసుకొని వొత్తి వెలగుని గాలిగల సీసాలోను, వెలిగిన గాలిగల సీసాలోను పోయుము. అప్పుడు వొత్తి వెలిగిన సీసాలోని సున్నపు నీరు పాలరంగుగా మారుటయు, వెలుగని సీసాలో మార్పేమియు కలుగకుండటయు గాంచుదుము. దీనివలన వత్తి కాలుటచే క్రొత్త వస్తువేదియో సీసాలోని గాలిలో కలిసినదని ఋజువగుచున్నది. అదియే వాయు సదృశమై మన దృష్టికి కనబడకుండా ఉండుచున్నదనియు, మైనపు వత్తి యొక్క పరమాణువు ఒక్కటియు నశించుట లేదనియు, ఆ వత్తి తయారైన పదార్థముల స్వరూపము మారుచున్నదనియు గ్రహించగలము.

ఒక నేత్ర రచనములోనే ఎంత విద్య ఇమిడి యున్నదో చూడుడు. నేటి వరకెంత నుందియెూ పెద్ద పెద్ద వైద్యులు తమ బుద్ధిని వినియోగించుచునే యున్నారు. కాని నేత్ర విద్య యపూర్వముగనే ఉండెను. ఏయే విధముగ ఏయే గుణములను ఈశ్వరు డందుంచినది ఎవరును నెరుగజాలకున్నారు. కావున సూర్యచంద్రాది లోకములను రచించి ధారణ మొనర్చుట ఈశ్వరుని పనియే. జీవునకు కర్మ ఫలములను సమకూర్చుటయు పరమాత్ముని కార్యమే. ఇతరులది కాజాలదు. కావున దేవుని ( నిమిత్తకారణముగ) ఒప్పుకొనుట తప్పని సరియైయున్నది.

ఒక భారతీయ ఫాదరు: రెండు వస్తువులుండి అందొకటి కార్యము, మరొకటి కారణమగుచో రెండును అనాదులు కాజాలవు. కావున దేవుడు నాస్తినుండి అస్తిత్వమును తన సామర్థ్యముచే రచించెను.

మౌల్వీ ముహమ్మదు కాసిం సాయిబు: - గుణములు అంతస్థములు బాహ్యములు అని ద్వివిధములు. అంతస్థములు తనలోనే యుండును. బాహ్యములు పరులనుండి తనకు సంక్రమించును. అంతస్థ గుణములింకొక దానిలోనికి వెళ్లి అటులనే ప్రతిబింబితములగును. దేనికి గుణములుండుచున్నవో అది మాత్రము దానినుండి వేరుగా నుండును. సూర్యుని ప్రతిబింబము ఏ పాత్రలో పడునో దాని వలెనే నదియు తయారగును. కాని అది సూర్యుడు కాజాలదు. అలాగుననే దేవుడు మనలను తన ఇచ్ఛచే సృజించి యున్నాడు.

స్వామి దయానంద సరస్వతి: - ( క్రైస్తవునికి ప్రత్యుత్తరము) రెండును అనాదులగుట తమరెందుకు శంకించుచున్నారు? లోకములోనున్న పదార్థములన్నిటి మూల కారణము పరమాణ్వాదులు అనాదులు. మరియు ఎవరును లెక్క వేయుటకు వీలుగా కుండునటులున్న జీవులును అనాదులే. నాస్తినుండి అస్తి ఎన్నటికి కాజాలదని నేను ముందే చెప్పియుంటిని. ఇక మీరు శక్తివలన తయారు చేసెనని యనుచున్నారు గదా! అయితే శక్తి ఏమి వస్తువో చెప్పండి. ఏదో వస్తువు అనెదరా! అదియే కారణమగుటచే అనాది యగును. దేవుని

నామము, గుణకర్మలు అన్నియు అనాదులు, ఏదియు ఇప్పుడు సృజింపబడినది కాదు.

మౌల్వీ సాయిబుకు జవాబు : లోపలి గుణములచే జగత్తు సృష్టింపబడినదనినను కాజాలదు. గుణములు ద్రవ్యములేకుండ నొంటరిగ నుండవు. గుణమునుండి ద్రవ్యము పుట్టజాలదు. లోపలి గుణములచే జగత్తు అయియుండినచో జగత్తుయు ఈశ్వరుడయ్యెను. బాహ్య గుణములచే జగత్తైనదని యనినచో మీరును దేవునితోపాటు ఆ గుణాలను- ద్రవ్యములను అనాదులుగా ఒప్పుకొనవలసి యుండును. ఇచ్ఛా మాత్రమున మనము తయారైతిమి యని యనుచో ఇచ్ఛా వస్తునా? గుణమా? అని నేనడుగుచున్నాను. వస్తువనిన అది అనాదియని స్థిరపడును. గుణముగ భావించుచో కేవలము ఇచ్ఛవలన ఘటము తయారు కాజాలదు. కాని మట్టి వలన తయారగును. అటులనే ఇచ్ఛా మాత్రముచే మనము సృజింపబడజాలము.

ఫాదరు స్కాటు దొర:- దేవుడు నాస్తినుండి అస్తిని సృజించెననునది మాత్రమే మేమెరుగుదుము, ఏ పదార్థముతో ఏ ప్రకారముగ జగత్తు రచింపబడినదో మేము ఎరుగము. అది దేవునికే ఎరుక. మనుష్యుడు ఎరుగజాలడు.

మౌల్వీ మహమ్మదు కాసిం సాయిబు:- దేవుడు తన ప్రకాశముచే జగత్తును రచించెను.

స్వామి దయానంద సరస్వతిగారు:- (ఫాదరు దొరకు జవాబుగా) కార్యమును బట్టి కారణమును చూడవలయును. కార్యరూప వస్తువు మాదిరిగానే కారణముండును. ఘటమును చూచి దాని కారణము మట్టియని తెలుసుకొనబడుచున్నది. ఘటమైన వస్తువు మట్టియే. శక్తిద్వారా జగుత్తు రచించెనని మీరనుచున్నారే! అయితే ఆ శక్తి అనాదియా? తర్వాత సృజింపబడినదా? అనాది యగుచో దానిని ద్రవ్యరూపముగ ఒప్పుకొనుచో దానినే జగత్తుకు అనాదికారణముగ స్వీకరించవలయును.

మౌల్వీ సాయిబుకు జవాబు:- నూర్ అనగా ప్రకాశము. ఆ ప్రకాశము వలన రెండవ ద్రవ్య మేదియు గలుగనేరదు. కాని ఆ వెలుతురు మూర్తివంతములగు ద్రవ్యములను ప్రసిద్ధముగ కనబరచగలుగుచున్నది. అది ప్రకాశింపజేయు పదార్థము లేకుండా విడిగా నుండజాలదు. కనుక జగత్కారణమగు ప్రకృతి మొదలగునవి అనాది అని ఒప్పుకొననిదే ఎవరికి నిర్వాహము జరుగదు. మేమును కార్యమును అనాదియని భావించము. కాని కార్యమెద్దానితో అగుచున్నదో ఆ కారణమును అనాదియని భావించెదము.

ఒక హిందుస్థాని క్రైస్తవ దొర:- ఈశ్వరుడు తన ప్రకృతి ద్వారా సమస్త సృష్టిని సృజించినట్లయితే అతని ప్రకృతిలో సంసారము సనాతనమై యుండెను మరియు అతను అతని ప్రకృతిలో అనాదియై యుండెను. అట్లగుచో దేవునికి సీమ ( ఆకారము) ఏర్పడినది.

స్వామి దయానంద సరస్వతిగారు:- ఈశ్వరుని ప్రకృతిలో సమస్త జగత్తుండినప్పుడే అది అనాదియైనది. ఆ అనాది వస్తువే రచించుటచే సీమాబద్ధమైనది. పొడుగు వెడల్పు, చిన్న పెద్ద మొదలైన అన్ని రకములను దేవుడద్దానినుండియే రచించెను. ఇటుల రచింపబడుటచే జగత్తే సీమాబద్ధమైనది కాని ఈశ్వరుడు కాలేదు. నాస్తినుండి అస్తి కలుగజాలదని నేనంటిని. విచారించండి. భావము నుండియే భావము జనించును. మీ మాటలవలన జగుత్తుయొక్క కారణము అనాది అనియే ఋజువైనది.

క్రైస్తవ దొర:- సోదరా! మౌల్వీ సాయిబా! వినుము. పండితులుగారు దీని జవాబు వేలకొలది విధములుగ ఇవ్వగలరు. మీరు మేము వేలాదిమంది కలిసి వీరితో వాదించినను పండితులుగారు విసుగు విరామము లేకుండ సమాధాన మివ్వగలరు. కావున ఈ విషయము నందధికముగ మాటలాడుట తగదు.

పదునొకండు గంటలవరకీ వార్త జరిగినది. తర్వాత ఎవరి డేరాలకు వారు వెళ్లిరి. తిరునాళ్ల యందంతట పండితులుగారిని గురించి విన్నదానికంటె వేయిరెట్లుగా చూచితిమని చెప్పుకొనసాగిరి.

మధ్యాహ్నము తర్వాత సభ:- మరల ఒంటిగంటకు అందరు సమావేశమైరి. సమయము తక్కువగను విషయము ఎక్కువగను ఉన్నది. కావున ముక్తి విషయము మీదనే మాటలాడుట మంచిదని నిర్ణయించబడినది. ముందు కొంతకాలము ముందెవరు ప్రసంగించవలయును? అని ఒకరిమీద ఒకరు భారము వేయుచు మాటలతో వెళ్లబుచ్చిరి. అప్పుడు స్వామిగారు పూర్వక్రమము ననుసరించియే భాషణము జరుగవలెను- అనగా ముందు ఫాదరీ దొర, తర్వాత మౌల్వీ సాయిబు ఆ తర్వాత నేను మాట్లాడవలయుననిరి. కాని ఫాదరీను మౌల్వీ గారలిరువురు మేము ముందుగా మాటలాడము అని తెలిపిరి. అప్పుడు స్వామిగారే ముందు మాటలాడుటకు సిద్ధపడిరి.

స్వామి దయానంద సరస్వతి:- ముక్తియనగా విడుదల పొందుట. దుఃఖములన్నింటినుండి వీడి సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుని పొంది సర్వదా ఆనందము ననుభవించుచు జన్మ మరణములు అను దుఃఖసాగరమున పడకుండ నుండుటయే ముక్తి. అది ఎటుల లభించగలుగును? దానికి మొదటి మెట్టు సత్యమును ఆచరించుట. ఆ సత్యమును ఆత్మ పరమాత్మ సాక్షిగా నిశ్చయమొనర్చవలయును. ఆత్మ పరమాత్మలు సాక్షులుగ లేనిది అసత్యము. దొంగతనముచేసిన వాడు పట్టుబడగా వానిని రక్షక భటులు నీవు దొంగతనము చేసితివాయని ప్రశ్నించెదరు. అప్పుడు అతని ఆత్మ లోపలినుండి నేను దొంగతనము చేసితినని చెప్పుచున్నను అతను మాత్రము దొంగతనము చేయలేదనును. అలాగుననే ఎవరైనా అబద్ధమాడ దలచినప్పుడు అంతర్యామియగు పరమాత్మ ''ఇది చెడ్డపని, దీనిని నీవు ఆచరించవలదు'' అని అతనిని హెచ్చరించును. లజ్జా శంకాభయములను అతని ఆత్మలో కలిగింపజేయును. సత్యమునకై మనసిచ్చువాని ఆత్మయందు ఆనందమును కలిగించుచు ఈ పని నీవు చేయువలసినదే అని ప్రేరేపించును. సత్యకార్యమొనరించునప్పుడు ఆత్మనిర్భయముగను, ప్రసన్నముగను ఉండును. అటుల అసత్యము నందుండదు. పరాత్పరుని ఆజ్ఞను త్రోసిపుచ్చి చెడుపనిని చేయుచో ముక్తి ఏ విధముగను అతనికి

కలుగ నేరదు. అతనిని అసురుడు, దుష్టుడు, దైత్యుడు, నీచుడు అని అనెదరు. ఈ విషయమునందు వేద ప్రమాణ మిటులున్నది.

అసుర్యా నామ తే లోకాః అంధేన తమసా వృతాః।

తాంస్తే ప్రేత్యాపి గచ్ఛంతి యే కే చాత్మహనో జనాః॥

(యజు: అధ్యా. 40. మం.3.)

ఆత్మను హింసించువాడు అనగా పరమేశ్వరుని ఆజ్ఞను ఉల్లంఘించినవాడు, తన ఆత్మ జ్ఞానమునకు విరుద్ధముగ మాటలాడువాడు, చేయువాడు, భావించువాడు అసురుడు, రాక్షసుడు, దుష్టుడు, పాపి, నీచుడు అగుచున్నాడు.

ముక్తి లభింపజేయు సాధనములివి. 1. సత్యాచరణము. 2. సత్యవిద్య. అనగా ఈశ్వర కృతమగు వేద విద్యను యథావతుగా జదివి జ్ఞానమును అభివృద్ధిపరుచు కొనవలయును. సత్యపాలనమును యథావతుగా ఒనర్చవలయును. 3. సత్పురుషులగు జ్ఞానులతో సంగతి యొనర్చుట. 4. యోగాభ్యాస మొనర్చి ఆత్మేంద్రియ మనస్సులను అసత్యమునుండి తొలగించి సత్యమున స్థిరపరచవలయును. జ్ఞానమును పెంచవలయును. 5. పరమేశ్వరుని స్తుతించుట అనగా అతని గుణముల వినుట, మననమొనర్చుట. 6. ఇటువంటి ప్రార్థన చేయవలయును:- హే జగదీశ్వర! హే కృపానిధే! హే అస్మత్పితః! అసత్యమునుండి మమ్ము తొలగించి సత్యమునందు స్థిరపరుచుము. హే భగవన్! మమ్ములను అంధకారము- అజ్ఞానము- అధర్మము మొదలైన దుష్ట కార్యములనుండి వేరు పరచి సదా విద్యా ధర్మాది శ్రేష్ఠ కార్యములందు స్థిరపరుచుము. జన్మ మరణరూపములగు సాంసారిక దుఃఖములనుండి విడిపించి తమ కృపా కటాక్షముచే అమృతము అనగా మోక్షమును లభింపజేయుము.

జీవుడు సత్యమైన మనస్సుతో తన ఆత్మ ప్రాణాది సామర్థ్యములచే పరమేశ్వరుని భజించుచున్నచో కరుణామయుడగు నా పరమేశ్వరుడు అతనిని తన ఆనందములో స్థిరపరచుచున్నాడు. ఒక చిన్న బాలుడు

ఇంటికప్పు మీదనుండి కిందనున్న తల్లిదండ్రుల వద్దకుగాని, క్రిందనుండి పైనున్న తల్లిదండ్రుల వద్దకు గాని రాగోరినచో అవసరమైన పనులెన్నియున్నను వానిని వదలి తల్లిదండ్రులు పరుగెత్తి తమ కుర్రావాడెక్కడైనా పడినచో దెబ్బ తగిలి బాధపడునను భావముతో వానిని ఎత్తుకొని చంకను పెట్టుకొనెదరు. తల్లిదండ్రులు తమ బాలురను సుఖముగ నుంచవలయునని కోరుచు ఎడ తెగకుండ పురుషార్థమొనర్చుచూ నుండెదరు. అటులనే పరమ కృపానిధియగు పరమాత్మవైపునకు యదార్థమగు ఆత్మ భావముతో నడచుచో అప్పుడతడు అనంతశక్తి రూపమగు చేతులతో - ఆ జీవమును ఎత్తుకొని తన ఒడిలో ఎల్లప్పటికిని ఉంచుకొనును. మరల అతని కెవ్విధమైన దుఃఖమును కలుగనీయడు. అతను (జీవము) నిరంతరము ఆనందముగ్నుడై యుండును. పక్షపాతమును త్యజించి సత్యగ్రహణమును అసత్యమును త్యజించి అర్థమును సిద్ధించవలయును. కాని గమనించండి. అధర్మము, అన్యాయము పక్షపాతములతో కూడిన పనులెన్నియెూ జరుగును. ఎట్లనగా:- ఈ మౌల్వీ సాయిబు ధరించిన బట్ట చాలా మంచిది. ఇది నాకు లభించుచో దీనిని నేను కప్పుకొని సుఖమును పొందుదును. ఇందు నా సుఖమునకై పక్షపాత మొనరించబడినది. కానీ మౌల్వీగారి సుఖ దుఃఖముల నేమియు విచారించలేదు. ఇదే విధముగ పక్షపాతము వలన నిత్యము అధర్మము జరుగుచున్నది. అధర్మముచే కార్యసిద్ధి యెునర్చుటయే అనర్థము అని అనబడును. ధర్మముచే, అర్థముచే కామములను అనగా తన సుఖమును సిద్ధింపజేసుకొనుట కామమనబడును. అధర్మము- అనర్థములచే సిద్ధించబడు కామమును కుకామమందురు, కావున ధర్మార్థ కామములు అను ఈ మూటిచే మోక్షమును పొందుట ఉచితము. ఇందులో నొక విషయమున్నది. ఈశ్వరాజ్ఞను పాలించుట ధర్మము. అతని యాజ్ఞను ఉల్లంఘించుట అధర్మమనబడును. ఆ ధర్మములు మొదలైనవే ముక్తికి సాధనములు,. ఇతరములెవ్వియు కావు. ముక్తి సత్యపురుషార్థము వలననే లభించును గాని వేరొండు విధమున కాదు.

ఫాదరు స్కాటు దొర- పండితులుగారు దుఃఖములన్నింటి నుండి విడుదల పొందుట ముక్తియని యన్నారు. కాని నేను సర్వ పాపములనుండి రక్షణపొంది స్వర్గములో ప్రవేశించుటను ముక్తియని యనుచున్నాను. కారణమేమన దేవుడాదామును పవిత్రముగా రచించెను. కానీ సాతాను అతనిని వంచించి పాపమొనరింపజేసెను. ఇందువల్ల యతని సంతాన మంతయు పాపులే. గడియారమును చేయువాడు దాని నడకను స్వతంత్రముగ నుంచెను. అదియు తనంతట తానే నడచుచున్నది. ఇదే విధముగ మనుష్యుడును తన కోరికమీదనే పాపము చేయును. అట్లయితే తన ఐశ్వర్యము వలన ముక్తియు పొందజాలడు. పాపములనుండి రక్షణయు పొందజాలడు. కావున యేసు ప్రభువు నందు విశ్వాసముంచనిదే ముక్తి లభించజాలదు. హిందువులును కలియుగము పాపములు చేయించి చెరుపుచున్నదని చెప్పుదురు. ఇందువల్ల వారికిని ముక్తి లభించనేరదు. వారును యేసునందు విశ్వాసముంచితేనే రక్షింపబడుదురు.

యేసు ప్రభువు ఏయే దేశములకేగెనో, అనగా ఆయన శిక్ష ప్రవేశించిన స్థానముల మనుష్యులు పాపములనుండి రక్షణ పొందుచున్నారు. నేడు క్రైస్తవులలో దప్ప నితర (ఎవ్వరి) మతములోనైనా మంచి గుణముల ఉన్నతియు పరోపకారములును ఉన్నవా? నేనొక దృష్టాంతము చెప్పెదను. పండితులుగారి యంతటి బలవంతుడొకడు ఇంగ్లండులో నుండెను. అతను మద్యపానము, వ్యభిచారము, చౌర్యము మొదలగు చెడు పనులు చేయుచుండెను. కాని యేసును విశ్వసించిన వెంటనే అన్ని చెడు మార్గములనుండి విముక్తి పొందెను. కావున నేనును యేసును విశ్వసించిననాడు ముక్తి పొందితిని. చెడులనుండి రక్షణ పొందితిని. కావున యేసు ఆజ్ఞలకు విరుద్ధముగ నాచరించిన ముక్తి లభించనేరదు. కనుక అందరు యేసును విశ్వసించవలయును. దాని వలననే ముక్తి లభించగలదు. ఇంకేవిధమున లభించదు.

మౌల్వీ ముహమ్మదు కాసిం సాయిబు:- పంతులుగారు ముక్తికి సాధనాలు చెప్పిరి. కేవలము నాటివలననే ముక్తి లభించుననని మేము

అనజాలము. ఆయా కాలముల అధికారి ప్రసన్నుడై అప్పటి యపరాధులను మన్నించి వదలవచ్చును. అప్రసన్నుడగుచో ఖైదులో వేయునచ్చును. అలాగుననే ఇష్టము వచ్చినవారికి మోక్షమిచ్చుట, ఇవ్వకపోవుట దేవుని ఇష్టముపీద ఉన్నది. కావున కేవలము పండితులుగారు చెప్పిన ముక్తిసాధనముల వలననే ముక్తి లభించునని మేము చెప్పజాలము. అతను ఇష్టానుసారము చేయును. అతనిపీద మన పెత్తనమేమియు లేదు. ఈశ్వరుడేమి చేయునో తెలియుదు. అప్పటి అధికారిని విశ్వసించి తీరవలయును. నేటి యధికారి మా పైగంబరు, అతనిని విశ్వసించితే ముక్తి లభించును. విద్యవలన మంచి పనులు కాగలుగుట తథ్యము. కాని ముక్తి మాత్రము కేవలమతని స్వాధీనములోనే ఉన్నది.

స్వామి దయానంద సరస్వతిగారు:- (ఫాదరు దొరకు ప్రత్యుత్తరము) దుఃఖమునుండి విముక్తి పొందుట మోక్షము కాదని పాప విముక్తియే ముక్తి అని మీరన్నారు. నా అభిప్రాయమును ఎరుగకపోవుటచే మీరటులన్నారు. ఏలయన నేను మొదటి సాధనములోనే పాపములన్నింటినుండి, అసత్య కర్మ లన్నిటినుండి దూరముగ నుండవలయునని చెప్పియుంటిని. చెడు పనుల ఫలితము కూడా దుఃఖమనబడుచున్నది. పాప మొనర్చుచో దుఃఖములనుండి తప్పించుకొనజాలడు. దీని తర్వాత ఇతర సాధనములలో కూడా అధర్మమును త్యజించి ధర్మమును అవలంభించుట ముక్తికి సాధనమని స్పష్టముగ చెప్పియుంటిని. ఫాదరు దొర ఈ మాటలను గ్రహించి యున్నట్లయితే ఇట్లు ఎప్పటికి మాటలాడి యుండరు.

దేవుడు ఆదామును పవిత్రముగ పుట్టించెననియు, కాని సాతాను వంచించి పాపమొరింప జేసినదనియు, అంతమాత్రముచే నతని సంతాన మంతయు పాపులైరనియు, మీరు చెప్పుచున్న మాటలు సత్యములు కానేరవు. ఏలయన మీరు ఈశ్వరుని సర్వశక్తిమంతుడనియే ఒప్పుకొనుచున్నారు. అయితే సాతాను ఈశ్వరుడు పవిత్రునిగా సృష్టించిన ఆదామును చెడగొట్టినది. దేవుని రాజ్యములో విఘ్నమొనర్చి [illegible]

వ్యవస్థను భంగపరిచినది. ఇక ఈశ్వరుడెటుల సర్వశక్తిమంతుడగును? దేవుడు చేసిన వస్తువును ఎవరు చెడగొట్టగలరు? ఒక్క ఆదాము పాపము చేసినంతమాత్రమున అతని సంతాన మంతయు పాపులగుట అన్నివిధముల అసంభవము, మిథ్యయునై యున్నది. పాపము చేయువాడే దుఃఖమును పొందును. ఇతరులెవరు ఇటువంటి మాటలను విద్వాంసులెవరు ఒప్పుకొనరు. ఒకే ఆదాము హవ్వలజతతో ఈ జగదుత్పత్తి ఎన్నటికి కాజాలదు. అన్న చెల్లెండ్రకు (తోబుట్టువులలో) పరస్పర వివాహమగుట పెద్ద తప్పయిన సంగతి. కావున సృష్ట్యాదిలో దేవుడు చాలామంది స్త్రీ పురుషులను పుట్టించెనని ఒప్పుకొనవలయును.

సాతాను చెడు త్రోవలో పెట్టుచున్నదని మీరన్న దానికి 'సాతాను అందరిని చెడు త్రోవ పట్టించు చుండిన ఆ సాతానును ఎవరు తప్పుత్రోవ త్రొక్కించుచున్నారు? అని ప్రశ్న వేయుచున్నాను.' సాతాను తనంతట తాను కుమార్గంలో సంచరించు చున్నదనినచో అటులనే జీవులన్నియు తమంతట తామే కుమార్గమును పట్టుచుండవచ్చును గదా! కావున సాతాను వంచించు చున్నదని తలచుట వ్యర్థము. సాతానును కూడా ఎవరో తప్పుదారి పట్టించి యుండవచ్చునన్నచో దేవుడు తప్ప దానిని తప్పుదారి త్రొక్కించ గలుగువారు లేరు. కావున దేవుడే వక్రమార్గమున పెట్టుచో ముక్తినిచ్చువాడును, పొందువాడును ఎవడు మీ మతములో ఉండడు. పరమాత్మయే వక్రమార్గ దర్శకుడగుచో రక్షించు వారెవరును కాజాలరు. ఇది పరమాత్మ స్వభావమునకు వ్యతిరేకము కూడ, ఏలయన అతను న్యాయకారి. సత్యకర్మలకు కర్త. మంచి పనుల వలననే అతడు ప్రసన్నుడగును. ఎవరికి దుఃఖమిచ్చువాడుగాని వక్రమార్గమున నడిపించువాడుగాని కాజాలడు.

చూడుడింకొక ఆశ్చర్యకరమైన విషయము:- సాతాను ఈశ్వరుని రాజ్యములో ఇంతగా అల్లరి చేయుచున్నను, దేవుడు దానిని దండించడు, కొట్టడు, జైలులో పెట్టడు. దీనివలన స్పష్టముగ పరమాత్మని నిర్బలత్వము కనబడుచున్నది. తప్పుదారి త్రొక్కించవలయునను కోరిక పరమాత్మునికే యున్నటుల విదితమగుచున్నది. కావున ఈ విషయము

సంగతమైనది కాదు. సాతాను అనునది (అసలు) ఒకటి లేనే లేదు. సాతానును ఒప్పుకొనువారు దానిని త్యజించనంతవరకు పాపము లొనర్చుటనుండి నిముక్తులు కాజాలరు. వారికి మనము పాపులమేకాము అను భావనేర్పడును. సాతాను ఆదామును- అతని సంతానమును తప్పుదారి పట్టించి పాపులుగా చేసినది. అలాగుననే ఆదాము సంతానముయొక్క పాపమునకు బదులుగా దేవుడు తన ఏకైక పుత్రుడగు యేసును శిలువమీద నెక్కించెను. ఇక మనకేమి భయము? మా వలన ఏదైనా పాపము జరుగుచున్నచో మాకు యేసుమీద విశ్వాసమున్నది కావున అతను స్వయముగనే క్షమించును. ఆయన మన పాపములకు బదులు ప్రాణమును ఇచ్చెను. అని తలచుచు ఇటువంటి వ్యవస్థను ఒప్పుకొనువారు పాపములనుండి రక్షణ పొందజాలరు.

గడియారపు ఉదాహరణము బాగుగానే ఉన్నది. ఏలయన అందరు వారి వారి పనులు చేసుకొనుటకు స్వతంత్రులు. కాని ఈశ్వరాజ్ఞ మంచి పనులు చేయుమని ఉన్నది. చెడు పనులు చేయమని లేదు. స్వర్గములో చేరుట ముక్తియని మీరన్నదియు, సాతాను వంచించుటచే మానవులకు ''పాపములనుండి విముక్తులై'' మోక్షము పొందు శక్తి లేదనుటయు సమంజసములు కాజాలవు. మనుష్యుడు స్వతంత్రుడు అని భావించినప్పుడు సాతాను ఒక మానవుడు కాదని తెలుసుకొన్నప్పుడు మీరు దోషములకు దూరముగనుండి పరాత్పరుని కృపవలన మోక్షము పొందగలరు. గోధుమలు తిన్నందువలన ఆదాము స్వర్గమునుండి వెడలగొట్టబడెను. ఆదాము గోధుమలు తిని పాపాత్ముడయ్యాడంటేను, అందుకుగాను అతను స్వర్గమునుండి వెళ్లగొట్టబడ్డాడంటేను, నేను ఒకటి అడుగుచున్నాను. మీరా స్వర్గమును వాంచించుచున్నారా లేదా? మీరందరచట అన్ని పదార్థములను భుజింతురా? అయితే పాపము గలుగదా? అక్కడినుండి వెళ్లకొట్టబడరా? కావున ఇదియు సంగతము కాజాలదు.

మీరు దేవుడు మనుష్యుని మాదిరిగా కడని తలచియుండవచ్చును. మనుష్యుడు సర్వజ్ఞుడు కాదు. అటులనే పరమాత్ముడుకూడాయని

భావించి యుండవచ్చును. కనుకనే మీరు అక్కడ సాక్షి, వకీలు కావలయుననుచున్నారు. మీరీ మాదిరిగా చెప్పుటవలన దేవుని దేవత్వమంతయు నష్టమై పోవుచున్నది. అతను అంతయు ఎరుగును. అతనికి సాక్ష్యము గాని వకీలుగాని అవసరము లేదు. ఎరుగని వానికి సిఫారుసు (మాటతోడు) అవసరమగును. కాని అతడు ఎరిగినవాడు కావున అతనికి ఎవరి సిఫారసుతోను పనియుండదు. మీ మాట వలన దేవుడు పరాధీనుడని నిర్ణయమగుచున్నది. ఏలయన యేసు సాక్ష్యములేకుండా, సిఫారుసు లేకుండా- ముక్తి ఎవరికి ఇవ్వజాలక పోవుటయేగాక ఏమియు ఎరుగజాలడు. ఇటుల పరమాత్ముడల్పజ్ఞుడును అగుచున్నాడు. ఏ విధముగను సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు కాజాలడు. కొంచెమాలోచించుడు. అతను న్యాయకారియే యగుచో ఎవరిదో సిఫారసువలన, అసత్యములగు ప్రశంసా వచనముల వలన న్యాయమునకు విరుద్ధముగ చేయజాలడు. విరుద్ధముగా నొనర్చిన న్యాయకారి ఎటుల కాగలుగును? ఇదేవిధముగ ఒక అధికారివలె దేవుని కొలువు కూటములో కూడ దేవ దూతలుందురని మీరు భావించుచో దేవునకింక చాలా దోషములు వచ్చును. దీనివలన దేవుడు సర్వ వ్యాపకుడు కాజాలడు. ఏలయన సర్వవ్యాపకుడగుచో శరీరధారి కాజాలడు. సర్వవ్యాపకుడు కానిచో శరీరము కలవాడగుట తప్పనిసరి అగును. అటుల శరీరధారియగుచో అతనిశక్తి అందరను కమ్ముకొనునది కాజాలదు. శరీరముగలవాడు తన జ్ఞానమెంత దూరమునకు ఉండదో, అంత దూరములోనున్న దానిని కూడ పట్టుకొనజాలడు, శిక్షించజాలడు. శరీర ధారికి జన్మ మరణములు తప్పక జరుగును, కావున దేవుడెచ్చటనో ఉన్నాడు, దేవ దూతలు అతని కొలువులో నున్నారు అని భావించుట, చెప్పుట ఏ తీరునను సముచితము కాజాలదు. లేనిచో దేవునికి హద్దు ఏర్పడును. ఆలోచించుడు! మా ఆర్యుల శాస్త్రములను సరిగా చదువని వారికి వ్యతిరేక నిశ్చయము కలుగును. ఒకదానికొకటి భావించబడును. ఫాదరు దొర కలియుగమును గురించి చెప్పినది సరియైనది కాదు. ఆర్యులమగు మేము యుగ వ్యవస్థను ఇటుల భావించము. ఇందులకు

ఐతరేయ బ్రాహ్మణపు ప్రమాణముస్నది.

★ కలి శ్శయానో భవతి, సంజి హాన స్తు ద్వాపరః।

ఉత్తిష్టం స్త్రేతా భవతి, కృతం సంపద్యతే చరన్॥

ఐత. పంచికా. 7; కండికా 15;

అన్నివిధముల అధర్మము చేయుచు పేరునకు మాత్రము ధర్మము చేయు వానిని కలియనియు, సగము ధర్మము సగము అధర్మము చేయువానిని ద్వాపరమనియు, ఒక భాగము అధర్మము మూడు భాగములు ధర్మము చేయువానిని త్రేతయనియు, అన్నివిధముల ధర్మము చేయు వానిని సత్య (కృత) యుగము అనియు అనెదరు. దీనిని ఎరుగక ఏమి మాటలాడినను సమంజస మెటులగును? కావున చెడుపని చేయువాడు దుఃఖమునుండి యెన్నటికి రక్షింపబడ జాలడు. ఏ దేశములో నుండినను మంచిపని చేయువాడు దుఃఖమనుభవించకుండ తప్పించుకొనగలుగును.

★ దేశ భాషలందు దెనుగు లెస్స యను కృష్ణ దేవరాయ లిటుల తెనిగించెను.

అ ఆలసత బరున్న మనుజుండు కలియుగంబు।

ద్వాపరం బెన్న గూర్చున్న వాడు త్రేత

యుత్థితుడు యాయి మఱి కృతయుగ మటన్న

నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినవే॥

-3.45 (కేశవార్య)

ఏసు సహాయము లేకుండా దేవుడు తన సామర్థ్యముతో తన భక్తులను రక్షించ జాలడా? అతను తన భక్తుల నన్నివిధముల రక్షించ సమర్థుడు. అతనికి పైగంబరుతో ప్రయోజనము లేదు. శిష్ట గరపు, దర్మాత్ములగు ఉత్తమ పురుషు లేయే దేశము లందుందురో ఆ దేశపు

ప్రజలు పాపముల నుండి తప్పించుకొందురు. ఆ దేశములోనే సుఖము - గుణములు వృద్ధి చెందును. దీనికి మతముతో ప్రయోజనమేమియు లేదు. అన్ని మతముల వారికిది సంస్కారణ. పూర్వకాలమున ఆర్యులందు ఉపదేశవ్యవస్థ మంచిదిగా నుండుటచే ఆ సమయమునవారు పరిశుద్ధులై యుండిరి. నేడనేక కారణములచే సత్యోపదేశము తక్కువ యగుటచే ఏదైనా ఒక విషయము చెడిపోయి యుండినచో ఆర్యుల సనాతన ధర్మమున కేదోషము అంటజాలదు. ఏలయన సృష్ట్యుత్పత్తి మొదలుకుని నేటివరకార్యుల ధర్మము నడుచుచునే యున్నది. అది పెద్దగా చెడిపో (కలుషితముకా) లేదు.

ఇంకొకటి గమనించండి. 18, 13 వందల సంవత్సరములలోనే క్రైస్తవ మహమ్మదీయ మతములలో పరస్పర విరోధములచే ఎన్నియో శాఖలు వెలిసినవి. వాని యెదుట 196,08,52,976 సంవత్సరములలో ఆర్యుల ధర్మము నందేమైన దోషము సంభవించినను చాలా తక్కువయని చెప్పదగును. మీలోనున్న మంచి (సంస్కారణ- ఉన్నతి) మతము వలనగాదు. కాని పార్లమెంటు మొ॥ ఉత్తమ ప్రబంధముల వలన కలిగినది. ఇవి లేకుండుచో మతము వలన ఏమియు సంస్కరించబడెడిది కాదు. ఫాదరు దొర ఇంగ్లాండు మనుష్యుని దృష్టాంతము నాతో పోల్చి యిచ్చియుండెను. ఆయన ఇటులనుట తగదు. ఏ విధముగ ఈ మాట పొరపాటుగా వారి నోటినుండి వెలువడినదో తెలియకున్నది.

మౌల్వీ సాయిబుగారికి జవాబు:- దేవుడు ఇష్టము చొప్పున చేయుననుటయు సంగతము కాజాలదు. ఏలయన అతను పూర్ణజ్ఞానము మరియు సరియైన న్యాయమునే కలిగియున్నాడు. ఎవరియందు పక్షపాతము చూపడు. ఏమి తలచిన అది చేయుననుటలో దేవుడు చెడు కూడ చేయుచుండ వచ్చుననియు అర్థము రాగలదు. చెడుయు అతని యిష్టము మీదనే జరుగుచున్నదనుట ఈశ్వరునికి చెల్లజాలదు. ముక్తికి తగు కార్యము నొనర్చు వానికే దేవుడు ముక్తి నిచ్చును. కాని ముక్తికి తగు కర్మ నాచరించనిచో ఎవరికి ముక్తి నివ్వడు. ఏలయన అతడన్యాయ మెన్నటికి చేయడు. పాపపుణ్యముల నిరీక్షించకుండ ఇష్టమొచ్చిన వానికి

దుఃఖమో సుఖమో చేకూర్చుననుటలో దేవునికి అన్యాయము మొ॥ కళంకము లంటుకొనుచున్నవి. కావున అతడటుల ఎన్నటికి చేయడు. ప్రకాశము, కాలుట అగ్నియొక్క స్వభావములు. వీనికి విరుద్ధముగ ఏమియు నెవరు చేయజాలరు. ఏమియు కాజాలదు. అటులనే పరమాత్మయు తన న్యాయ స్వభావమునకు విరుద్ధముగ పక్షపాతముగ ఏవ్యవస్థయు చేయనేరడు.

ఎల్లకాలములందు ముక్తినిచ్చు అధికారి దేవుడే ఇతరుడెవ్వడు కాడు. ఎవరైనా ఇతరుని ( ముక్తిదాతగా) భావించుచో అతని భావనవ్యర్థము.

ఇతరుల మీద విశ్వాసముంచి నంతమాత్రమున ముక్తి ఎన్నటికి లభించదు. ఏలయన దేవుడు ముక్తినిచ్చు విషయములో పరాధీనుడు గనో, రెండవవాడు చెప్పుటవలన ఇచ్చువాడుగనో అగుచో ముక్తి నిచ్చు విషయములో దేవుడు పరాధీనుడే యగును. ఈ స్థితిలో అతను ఈశ్వరుడే కాజాలడు ఆయన సర్వశక్తిమంతుడు. కావున తనపనియం దితరుల సహాయము ఆపేక్షించడు.

విద్వాంసులందరు ఇటులనే భావించు చున్నారని నేను తలచుచున్నాను. పక్షపాతముచే ఇతరులను నమ్మించుటకై పైకిమాత్రము ఒప్పుకొనకుండ నుండుచో ఆ సంగతి, ఆ కథ వేరు.

ఒకవైపు పరమాత్ముని సర్వశక్తిమంతునిగా భావించుచు రెండవ వైపున ముక్తి నిచ్చు విషయములో పైగంబరులనుకూడా అతని సహాయమునకు కలుపుచున్నారు. అది పెద్ద ఆశ్చర్యముగ నున్నది. విద్వాంసులెవరు దీనిని స్వీకరించరు.

చివరకు తేలిన సిద్ధాంత (సారాంశ) మిది. పరమేశ్వరుడు ధర్మాత్ములగు మనుష్యులకు ముక్తియోగ్యములగు కార్యను లొనరించుటచే స్వతంత్రించి ముక్తినిచ్చును. కాని ఒకానొకని సహాయమున కాధీనుడై ఆ పని చేయడు. మనుష్యునకే పరస్పర సహాయ మపేక్షణీయము కాని దేవునికి అవసరము లేదు. మిథ్యగ ప్రసన్నుడై

అన్యాయ మొనరించుటకై మిథ్యగా ప్రసన్నుడగువాడును కాడు. అతడైతే తన సత్య ధర్మమునందును, న్యాయము నందును సర్వకాలముల నుండును. సత్యమగు ప్రేమచే నిండియున్న తన భక్తులకు యథావతు ముక్తినిచ్చుచు సమస్త దుఃఖములనుండి రక్షించుచు వారిని ఎల్లప్పటికీ ఆనందము నందుంచుచున్నాడు. ఇందులో సందేహమేమియు లేదు.

ఇంతలో నాలుగుగంటలైనది. మా యుపన్యాసమింకను ఉన్నదని స్వామిగారనిరి. మౌల్వీ సాయిబుగారు మాకు నమాజుకు సమయమైనదన్నారు. ఫాదరీ స్కాటు దొరయు తమతో నేకాంతముగ కొంచెము ముచ్చటించవలసి యున్నదని స్వామిగారితో చెప్పగా వారిరువురొకవైపుకు వెళ్లిరి. ఇక్కడ ఒక మౌల్వీ చెప్పులు ధరించి మేజాబల్లమీద ఒకవైపున నిలబడియు, రెండవ వైపున ఫాదరును తమ మతముల గురించి ఉపన్యాసమును ఇవ్వసాగిరి.

ఇంకెందరో మేలా అయిపోయిందని ప్రచారముచేసారు. అప్పుడు స్వామిగారు ఆర్యులను, ఫాదరును ఏమిటి గడబిడ జరుగుచున్నదనియు మౌల్వీ నమాజుచేసి వచ్చెనా లేదా అనియు అడిగిరి. వారు మేలా అయిపోయిందని జవాబిచ్చిరి. (ఎవరిని అడుగకుండ, ఎవరి సమ్మతియు తీసుకొనబడకుండ ఇటుల తొందరపాటుగా మేలాను ఎవరు సమాప్త మొనరించిరి? ఏమైనా వార్తాలాపము జరుగునా? లేదా? అని స్వామి గారడిగిరి. గడబిడ ఎక్కువగా ఉండుటయు, సంవాదమునకేమియు వ్యవస్థ లేదనియు గుర్తించబడినప్పుడు, మేలా పూర్తియైనది. ఇక తమరును పదండి అని ప్రజలు స్వామిగారితో అనిరి. కనీసము 5 దినములైనా మేలా జరుగవలసినదిగా మా కోరిక యుండెనని స్వామిగారనగా ఆ ఫాదరు దొరలు రెండుదినములకంటె నెక్కువ కాలము మేముండజాలమని జవాబు చెప్పిరి. తర్వాత స్వామిగారు తన డేరావద్ద ధర్మసంవాద మొనర్చసాగిరి. ఆ రోజున రాత్రి ఫాదరు స్కాటు దొర ఇంకా ఇద్దరు ఫాదరులతోపాటు స్వామిగారి డేరావద్దకు వచ్చిరి. స్వామిగారు కుర్చీలు వేయించి ఆదరపూర్వకముగా వారిని కూర్చొనబెట్టి తానును కూర్చొనిరి.

పరస్పరము మాటలాడుకొనసాగిరి. ఫాదరుదొరలు ఆవాగమనము (పునర్జన్మ) సత్యమా? అసత్యమా? దీనికేమి ప్రమాణము అని అడిగిరి. ఆవాగమనము సత్యమనియు, ఎవడు ఎటువంటి పనిచేయునో అటువంటి శరీరమునే అతడు పొందుననియు, గొప్ప ఉత్తమ కార్య మొనర్చువాడు దేవత అనగా విద్వాంసుడు, బుద్ధిమంతుడు అగుననియు, మంచి పనిచేయువాడు మనుష్య శరీరమును, చెడు పని చేసిన పక్ష్యాదుల శరీరమును పొందు ననియు వెనుకటి జన్మపు, అభ్యాసము ఇంకా ఉండియుండుట వలననే శిశువు జన్మించిన వెంటనే తల్లిపాలు త్రాగ మొదలిడుచున్నాడనియు, బీద, భాగ్యవంతులను, సుఖులను, దుఃఖులను, ఇంక అనేక విధముల చిన్న పెద్దవాండ్రను చూస్తూ ఉండుటవలన కర్మల ఫలితము ఉన్నదనియు విదిత మగుచున్నది. కర్మవలన దేహము, దేహమువలన ఆవాగమనము సిద్ధము. జీవము అనాది, దానికి ఆది-అంతము లేదు. అది ఏ యోని నుండి పుట్టినదో ఆ యెూని స్వభావమును కొంచెము ఉండనే ఉండును. ఈ కారణముచేతనే మనుష్యులు మొ॥వారు విచిత్ర స్వభావముగలవారు, విచిత్ర ప్రకృతిగలవారు అగుచున్నారు. దీనివలనను ఆవాగమనము ఋజువగుచున్నది.

ఇదేవిధముగ ఆవాగమనమునకు చాలా ప్రమాణములున్నవి. కాని జీవ యెుక్కసారియే పుట్టుటకు మరల జన్మించకుండుటకు ప్రమాణములు ఏమియునుండవు. అటులగుచో నేనుచెప్పిన దానికి వ్యతిరేకముగ నుండవలసి యుండును. కాని అటులుండుట అసంభవము, ఇదియునుగాక చనిపోయిన తర్వాత విచారణ దినము వచ్చునంతవరకు అతను రిమాండులో నుండుట, అంతవరకు అతని లెక్క చూడబడకుండుట, ఇటుల భావించుట మంచిదికాదు. అని స్వామిగారు అనిరి. అంతట ఫాదరు వెళ్ళిపోయిరి.

మౌల్వీలు షాహజానప్పూరు వెళ్లి మున్శీ ఇంద్రమణిగారికి ''మీరిక్కడకు వచ్చినట్లయితే మీతో శాస్త్రార్థము చేయగోరుచున్నాను''

అని వ్రాసిరి. కాని స్వామిగారును. మున్శీగారును అచ్చటకు విచ్చేయుగా శాస్త్రార్థము సేరే ఎవరును ఎత్తనేలేదు.

ఋషి (7) కాలా (3) క (9) బ్రహ్మ (1) బ్దే నభశ్శుక్లే దలే తిథౌ।

ద్వాదశ్యాం మంగలే వారే గ్రంథో౽యం పూరితో మయా॥

( వి.శ 19 7 శ్రావణ మాసమున శు॥ 12 మంగళవారమున ఈ గ్రంథము పూర్తి చేయబడినది. )

## వైదిక విప్లవము

ఓ ఆర్య సమాజకులారా! ఓ వైదిక ధర్మ ప్రియావళంబు... ! ఓ పండితులారా! ఒక్కసారి మీ పౌరుషమును ప్రదర్శించుడు ల... రండు నడుము బిగించి పాఖండ ఖండని పతాకను చేతబూని మతమతాంతరములలోని లోపములను తుత్తునియలుజేసి నిజమైన భగవంతుని స్వరూప మిదియను సత్యమును ప్రపంచమున చాటుడు. మీలోని స్వార్థమును, పదవ్యామోహమును వదిలి, వైదిక 'ఓం' ధ్వజమును ఎగరవేసి నేడు దేశములో చెలరేగుచున్న అలజడులను అహింసలను, అత్యాచారములను, రాజకీయ పతన (చీలిక) ము... చక్కదిద్దుటకు వైదిక ధర్మమే శరణ్యమని తెలియజేయుడు. హైదరాబాద్ సత్యాగ్రహమునకు పూర్వపు మీలోనున్న ఐక్యతను ఒక్కసారి విజృంభించి, స్మరించుకొనుడు.



GAYATRI SERIES - 33

SATYA DHARMA VICHARANA Rs. 6=00

# గాయత్రి ఆశ్రమ ట్రస్టు వారి పుస్తకములు పట్టిక

1. గోమాత
2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి
3. మానవ ధర్మము
4. గాయత్రీ మహిమ
5. వైదిక క్రాంతి పథం
6. చతుర్దశ భువనములు
7. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము
8. యజ్ఞోపవీత వైశిష్ట్యము
9. జననీ - జన్మభూమి
10. దౌహృదిని (ఋషులదృష్టిలో గర్భిణిస్త్రీ)
11. యుగపురుషుడు శ్రీకృష్ణుడు
12. పురుషోత్తముడు శ్రీరాముడు
13 మహర్షి మనువుపై విరోధమెందుకు?
14 వేదములలో విజ్ఞాన బీజాలు
15. ధర్మవీర్ పం. లేఖరాం
16. వైదిక వివాహ వైశిష్ట్యము
17. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ
18. మాతా పుత్రికల జ్ఞాన చర్చ
19. బ్రహ్మచర్య విజ్ఞానము
20. వైదిక అర్థనీతి
21. దయానందుని ఆదర్శ రాజ్యము
22. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి
23. దైనిక అగ్ని హోత్ర విధి
24. ది గ్రేట్ గాయత్రి
25. శాంతి ప్రార్థన
26. చాణక్యనీతి
27. శ్రీ దయానంద హృదయము
28. ప్రణవ స్తోత్రమ్
29. లక్ష్మీ సూక్తమ్ (వ్యాఖ్యానముతో)
30. వేదాలలో జలచికిత్స విధానము
31. వేదాలలో అప్సరస గంధర్వులు
32. స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు
33. సత్యధర్మ విచారణ